శ్రీః

# శ్రీ భాగవత చంపూః

(మంథర వ్యాఖ్యాన సమంచితా)

రచయితా

'అభినవకాళిదాసః'

**శ్రీ వెల్లాల చిదంబరశాస్త్రీ**

వ్యాఖ్యాతా

**శ్రీ బెల్లంకొండ రామారాయ కవిః**

**(27-12-1875 -- 27-10-1914)**




క్షీరపురివాసినా

**రావి మోహనరాయేణ**

ముద్రాపితా

ప్రకాశికా

**శ్రీమతీ రావి కృష్ణకుమారీ**

**404, జంజనం కాంప్లెక్స్**

**చీరాల - 523 155.**

శ్రీః

**శ్రీభాగవత చంపూః**

**(మంథర వ్యాఖ్యాన సమంచితా)**

**రచయితా**

**'అభినవకాళిదాసః' శ్రీ వెల్లాల చిదంబరశాస్త్రీ**

**వ్యాఖ్యాతా**

**శ్రీ బెల్లంకొండ రామారాయ కవిః**

**(27-12-1875 -- 27-10-1914)**

**పీఠికా : భాగవతము - బెల్లంకొండ**

**గరిమెళ్ళ సోమయాజులు శర్మ**

ముద్రణా : ది. 11. 05. 2016, శ్రీశంకరాచార్య జయంతి
ప్రతులు : 500
పుటలు : 452
వెల రూ.: 400/-



Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

D.T.P.:
**P.PARVATHI**
CELL: 7416586775



# నా మాట

నాడు

**అభినవకాళిదాస** బిరుదాంకితుడు **శ్రీ వెల్లాల చిదంబరశాస్త్రిగారు** రచించిన **శ్రీ చంపూభాగవతము అపరశంకర** బిరుదాంకితుడు **శ్రీ బెల్లంకొండ రామరాయ** కవీంద్రులు వెలువరించిన మంథర వ్యాఖ్యా సహితంగా తెలుగులిపిలో 1949వ సంవత్సరంలో నర్సరావుపేట వాస్తవ్యులు శ్రీ తాడేపల్లి వేఙ్కట నారాయణశ్రేష్ఠిగారిచే ముద్రింప బడినది.

పిమ్మట ఈ కావ్యము నాగరిలిపిలో 1961వ సంవత్సరంలో గర్తపురీ పంచాక్షరీ ముద్రణాలయము, గుంటూరు వారిచే ముద్రింపబడినది.

**నేడు**

ఈ కావ్యము నేడు ది. 11. 05. 2016, శ్రీశంకరాచార్య జయంతినాడు తెలుగులిపిలో నూతన ముద్రణాపద్ధతిలో, శ్రీగరిమెళ్ల సోమయాజులు శర్మ గారు అందించిన '**భాగవతం – బెల్లంకొండ**' అను నామమున్న విస్తృత పీఠికతో వెలువరింపబడుట కడు సంతోషదాయకము.

నాటి ముద్రిత ప్రతులను అందించి శ్రీ బెల్లంకొండ చక్రధర్ కుమార్ గార్కి శుభాశీస్సులు.

పితృతుల్యులు, పీఠికాకర్త శ్రీ గరిమెళ్ల సోమయాజులు శర్మ గార్కి, సోదర తుల్యులు, ప్రశంసాపద్యత్రయకర్త శ్రీ వుయ్యూరు లక్ష్మీనరసింహారావు గార్కి నమస్సుమాంజలులు.

చీరాల, **రామోరా**

**23. 03. 2016.** సంపాదకులు.

## ప్రశంసా పద్యములు

చం॥ అభినవకాళిదాసబిరుదాంచితుఁడైన సదాశివుండు వా
గ్విభవము మీఱ భాగవతవృత్తము సంస్కృతచంపు పద్ధతిన్
ప్రభువులు పండితుల్ వొగడ వ్రాయఁగ, బెల్లముకొండవంశజుం
డభినవశంకరుం డొసఁగె వ్యాఖ్యను దానికి రామరాయయో
గి భువనమాన్యుఁ డంతటను గృష్ణనిలీలలు నిల్చున ట్లహో!
శుభములు హెచ్చె నాకృతివచోగతు లిట్టులు నీవు తీర్చుటన్.

చం॥ మును పటు లచ్చువేసినవి పుస్తకసంతతు లొక్కయెత్తు, శ్రీ
వనజదళాక్షపుణ్యకథ భాసిలు నీకృతి వందయెత్తు లో
వినుతవివేకశాలి! బుధవీరవచోగతిశీలి! రావి మో
హనశుభనామ! నీభవము సార్థక మయ్యెను దీనిచే మహిన్.

శా॥ రామోరా! యిటువంటి పుణ్యమయకార్యాలన్ గడుం జక్కఁగా
ధీమాన్యాళియుఁ జేయఁజాలరిల స్వస్తీ తోడులేకున్న, నీ
శ్రీమత్యాదరభావసంపదలపూర్తిస్థాయి నీకుండుటన్
శ్రీమంతంబులు వాఙ్మయాధ్వరము లీరీతిన్ మహిన్ శోభిలెన్.

దీ. 9.2.2016, మంగళవారము
ఉదయము గం. 8.10ని.

సారస్వత మిత్రుఁడు
డా॥ పుయ్యూరు లక్ష్మీనరసింహారావు,
గుంటూరు.

ఓమ్

శ్రీరామచన్ద్రాయనమః

# భాగవతము - బెల్లంకొండ

శ్రీ మద్రామాయణ - భారత - భాగవతములు సంస్కృతభాషలో సుప్రసిద్ధములై ప్రపంచములోఁ బ్రచుర ప్రచారము పొందిన గ్రంథములు. అనంతరసాహిత్యముపై వీని ప్రభావము మిక్కుటముగాఁ గలదు. పద్యము - గద్యము - చంపువు - నాటకము - ఖండకావ్యము - గీతికావ్యము మొదలగు ప్రక్రియలలో వీని పరివర్తనములు గణనాతీతముగా వెలసినవి. చంపూ ప్రక్రియలో (1) భోజుని రామాయణ చంపువు (2) అనంతభట్టు భారత చంపువు (3) అభినవ కాళిదాసు భాగవత చంపువు నెక్కువ ప్రచారము గాంచినవి.

**'పద్యగద్యమయం కావ్యం చంపూరిత్యభిధీయతే'** అను దండి లక్షణము ననుసరించి పద్యములు, గద్యములు మిళితములైన కావ్యములు చంపువులు.

రఘువంశము, కుమారసంభవము మొదలగునవి పూర్తిగాఁ బద్యకావ్యములు. కాదంబరి, దశకుమారచరిత్ర మొదలగునవి పూర్తిగా గద్యకావ్యములు. యశస్తిలకము, భోజరామాయణము మొదలైనవి చంపూకావ్యములు.

చంపూప్రక్రియ పూర్తిగా దాక్షిణాత్యోపజ్ఞము. కన్నడసాహిత్యము, తెలుఁగు సాహిత్యము ప్రాయికముగాఁ బద్య - గద్య మిశ్రమములు. ఇదియే సంస్కృతములోఁ జంపూ ప్రక్రియగాఁ బరిణమించి వృద్ధి చెందినది. 10వ శతాబ్దము నుండి చంపూకావ్యములు రచింపఁబడినవి. త్రివిక్రమపండితుని (10శ॥) నలచంపువు(దమయంతీకథ) ప్రాచీనమైనది. రామాయణముననుసరించి, భారతము ననుసరించి వచ్చిన చంపువులకంటె భాగవతముననుసరించి వచ్చిన చంపూకావ్యము లెక్కువగాఁగలవు.

### చంపూ భాగవత పరంపర

**1. అనంతభట్టు (16 శ॥) :** అనంతభట్టు రచించిన చంపూభారతము ప్రసిద్ధమైనది. ఇతఁడాంధ్రుఁడు. ఈ కవికుంజరుఁ డభినవకాళిదాసుతో స్పర్ధ వహించి చంపూభాగవతమును గూడ నిర్మించెనఁట! ఇది నేఁడు లభింపదు. చంపూభారతమునకు వివిధ లిపులలో ననేక సంస్కరణములు గలవు.

2. **అభినవ కాళిదాసు (16 శ॥) – (వెల్లాల యుమామహేశ్వరశాస్త్రి)** : ఇతఁడు కూడ నాంధ్రుఁడే. ఇతఁడు రచించిన చంపూభాగవతమే ప్రస్తుతము పాఠకుల చేతిలో నున్న గ్రంథము. ఈ కవి నిజనామము వివాదగ్రస్త మగుటచే దీనిని గూర్చి విస్తరముగాఁ దరువాతఁ బరిశీలింతము.

3. **అవసరాల పద్మరాజు (19 శ॥)** : ఇతఁడు గోలకొండ నియోగి బ్రాహ్మణుఁడు. పిఠాపుర పాలకుఁ డగు నీలాద్రినాయని (1800) మంత్రిగా నున్నవాఁడు. '**అంభోజ**', '**వర్ణాధికభోజ**' బిరుదాంకితుఁడు. ఇతఁడు 5 సర్గములలో భాగవతచంపువును రచించినాఁడు. ఇది యమలాపురము శర్వాణీ ముద్రణాలయములో 1908లోఁ దెలుఁగు లిపిలో ముద్రింపఁబడినది.

4. **గోపాలశాస్త్రి (18 శ॥)** : ఇతఁడు కూడ నాంధ్రుఁడు. '**అభినవకాళిదాస**' బిరుదాంచితుఁడు. ఉదయ ప్రళయరాజు నాస్థానకవి. ఈ గోపాలశాస్త్రి కూడ నొక భాగవతచంపువును రచించినాఁడు.

5. **చిదంబరకవి (16 శ॥)** : ప్రస్తుత చంపూ భాగవత కర్త చిదంబర కవి యని శ్రీ బెల్లంకొండ రామరాయకవి వాక్రుచ్చినారు – ఇది వివాదగ్రస్త విషయమగుటచే నీకవిని గూర్చి కూడఁ దరువాతఁ జర్చింతము.

6. **రాజనాథ కవి (16 శ॥)** : ఇతఁడు కూడ నాంధ్రుడే. కుమారడిండిముని కుమారుఁడు. మూఁడవ రాజనాథుఁడు విజయనగరమును బాలించిన యచ్యుతరాయల (1530 – 1542) యాస్థానకవి. (1) అచ్యుతరాయాభ్యుదయము (2) భాగవతచంపువు వీని రచనలు.

7. **రామపాణివాదుఁడు (18 శ॥)** : ఇతఁడు కేరళీయుఁడు. నారాయణభట్టు శిష్యుఁడు. సంస్కృత – ప్రాకృత – మళయాళ భాషలలో ననేక మహా గ్రంథములు రచించినవాఁడు. (1) ముకుంద శతకము (2) శివ శతకము (3) సూర్య శతకము (4) అంబరనదీశ స్తవము మొదలగునవి స్తోత్ర కావ్యములు. (5) 'పంచపాది' జయదేవుని 'యష్టపది' వంటి గీతికావ్యము. (6) విష్ణు విలాసము (7) రాఘవీయము (8) రాసక్రీడ – కావ్యములు (9) భాగవతము – చంపూకావ్యము (10) చంద్రిక (వీథి) (11) లీలావతి (వీథి) (12) మదనకేతుచరితము (ప్రహసనము) (13) సీతారాఘవము – నాటకములు. (14) వృత్తవార్తికము – ఛందోగ్రంథము (15) తాళప్రస్తారము సంగీతగ్రంథము (16) విష్ణువిలాస వ్యాఖ్య – విష్ణుప్రియ (17) రాఘవీయవ్యాఖ్య – బాలపథ్యము (18) శ్రీకృష్ణ విలాస వ్యాఖ్య – విలాసిని (19) ధాతుకావ్య వ్యాఖ్య – వివరణము – వ్యాఖ్యాన గ్రంథములు. (20) ప్రాకృతవృత్తి (21) ఉషానిరుద్ధము (22) కంసవహో (కంసవధ) – ప్రాకృత గ్రంథములు.(23) శ్రీకృష్ణ చరితము (24) శివ పురాణము (25) పంచతంత్రము (26) రుక్మాంగద చరిత్ర మొదలగునవి మళయాళ గ్రంథములు. రామపాణివాదుని చంపూభాగవతములోని 9 స్తబకములు మాత్రమే లభించినవి. ముచుకుందో–పాఖ్యానము వఱకుఁ గథ సాగినది. దీనిలో మధ్య మధ్య ప్రాకృత వాక్య పంక్తులు గలవు.

రామపాణివాదుని ప్రతిభా – పాండిత్యములు సర్వతోముఖములు. ఈ కవి రచించిన పెక్కు గ్రంథము '**లనంతశయన**' గ్రంథమాల (Trivendrum University) వారిచేఁ బ్రకటింపఁబడినవి.

**8. రామభద్ర కవి , 9. శివకవి** : మొదలగు వారు కూడ భాగవతచంపువులు రచించినట్లు శ్రీమాడభూషి కృష్ణమాచార్యులు చెప్పుచున్నారు.

ఈ చంపూభాగవతకర్తలలోఁ బెక్కుమంది కవులు మన తెలుఁగువారే.

### ప్రస్తుత చంపూభాగవత కర్త యెవరు?

ఈ చంపూభాగవత కర్తను గూర్చి యించుక యాలోచింపవలసి యున్నది. గ్రంథకర్త తా '**నభినవ కాళిదా**' సని చెప్పుకొన్నాఁడు గాని తన యసలు పేరెక్కడ పేర్కొనలేదు.

**శ్లో॥ అభినవపదపూర్వః కాళిదాసః ప్రగల్భః**
**త్రినయనదయితాయాః ప్రేమడింభస్తృతీయః ।**
**విరచయతి తయైవ ప్రేరితః ప్రేమపూర్వం**
**హరిగుణపరిణద్ధం చారు చంపూప్రబంధమ్ ॥ (1-7)**

**శ్లో॥ యస్మిన్నంకరదారసౌరభఝురీజృంభత్కటాక్షచ్ఛటా**
**పాతాః కల్పలతావితానసుమనోగుంభప్రియంభావుకాః ।**
**తస్యాసౌ నవకాళిదాసవిదుషష్షష్ఠోఽపి కావ్యామృతే**
**చంపూనామని ధీమతాం కృతసముల్లాసో విలాసోఽగమత్ ॥ (6-174)**

ఈ చంపూకర్త వెల్లాల చిదంబరకవి యని శ్రీబెల్లంకొండ రామరాయకవి కంఠోక్తిగా నిర్దేశించినారు.

"ఇహ ఖలు వెల్లాల కులకలశవారాశిచిన్తామణిః, ఫణితరాఘవపాణ్డవయాదవీయాభిధచిత్ర-ప్రబన్ధః, శ్లేషయమకధ్వనిచక్రవర్తీ, అభినవకాళిదాసాత్మకపౌరుషనామా, చిదమ్బరనామా మహా-కవిః..."

శ్రీ మాడభూషి కృష్ణమాచార్యులు '**వెల్లాల కవి**' యని చెప్పినారు. శ్రీ బిరుదురాజు రామరాజు మొదలగు వారు వెల్లాల యుమామహేశ్వరశాస్త్రి యని పేర్కొనినారు.

### చిదంబర కవి

చిదంబరకవి యింటిపేరు 'వెల్లాల' వా రని చెప్పినవారు బెల్లంకొండ వారొక్కరే. చిదంబరకవి తాతగారు సూర్యనారాయణయజ్వ. తల్లి వెంకటాంబ. తండ్రి యనంత నారాయణుఁడు. వీరు కౌశిక గోత్రులు. ఆంధ్ర దేశము నందలి గోదావరీ మండలములోఁ బుట్టి తమిళ దేశమునకు వలసపోయి తంజాపుర మండలములో స్థిరపడినవారు. చిదంబర కవి యనేక శ్లేష ప్రబంధములు రచించినాఁడు. ఇతని కావ్యము లివి -

1. **శ్రీ వేంకటేశ్వర స్తుతి** : ఇది 200 శ్లోకముల స్తోత్రకావ్యము.

2. **చిదంబర విలాసము** : దీనిలో 5 సర్గములు గలవు. చిదంబరేశ్వరుఁడగు నటరాజు కథ వర్ణింపఁ బడినది. దీనిపై గ్రంథకర్తయే '**యర్థదీపిక**' యను వ్యాఖ్య వ్రాసినాఁడు.

**శ్లో॥ మోచాసారముచాం చిదంబరకవేర్వాచాం పరం వైభవం**
**శ్రావ్యం కావ్యమిదం చిదంబరవిభోః సంసద్విలాసం వరమ్ ।**
**రీతి శ్రీరధరీకరోతి విబుధాం సౌధీమసౌ సారధీ-**
**రేతచ్చారు బహుప్రయోగచతురస్వాలోకమాలోకతామ్ ॥**

3. **శ్లేషచింతామణి** : దీనిలో 110 శ్లోకములు గలవు. ప్రతి శ్లోకము రెండర్థములు గలది. దీనికిఁ గూడ గ్రంథకర్తయే వ్యాఖ్య రచించినాఁడు.

**శ్లో॥ సదంబరసరిద్వేణీమదం విరసయంత్యసౌ ।**
**ముదంబరధియాం ధత్తాం చిదంబరసరస్వతీ ॥**

4. **శబ్దార్థచింతామణి (రాఘవయాదవీయము)** : ఈ కావ్యములో 2 సర్గములలో రామాయణ – భాగవత కథలు జోడింపఁ బడినవి. దీనికి గ్రంథకర్తయే '**నికషోపల**' వ్యాఖ్య జోడించినాఁడు.

**శ్లో॥ అత్యర్థస్ఫురణోపపాది సుతరామాబిభ్రతోఽనర్ఘతా**
**మోజః స్ఫూర్త్యుపకల్పనాతిసరలాదుత్తేజనాశిల్పితః ।**
**చిత్రం సారమిదం చిదంబరకవేః శబ్దార్థచింతామణేః**
**వ్యాఖ్యానం నికషోపలాఖ్యమనఘం విద్వన్ముదే కల్పతామ్ ॥**

**శ్లో॥ యద్యేకదా వీక్షితుమాత్మయత్నం । రామాయణం భాగవతం చ రమ్యమ్ ।**
**చిత్రం బుధా యాంతు చిదంబరీయం । శబ్దార్థచింతామణిమాప్తశస్తిమ్ ॥**

5. **రాఘవపాండవయాదవీయము :** ఇది త్ర్యర్థి కావ్యము. ప్రతి శ్లోకము 3 అర్థములు గలది. దీనిలో 3 సర్గములు 155 శ్లోకములు గలవు. రామాయణ – భారత – భాగవత కథలు పెనవేయఁబడినవి.

**శ్లో॥ సారంభా విబుధాస్సుధారసధరం రామాయణం భారతం**
**సారం భాగవతం చ కించ సరసా యద్యేకదా వీక్షితుమ్ ।**
**ప్రజ్ఞాతుం చ పదప్రపంచవిభవం సర్వం తు కుర్వంతు తే**
**ప్రజ్ఞాతుంగహృదశ్చిదంబరకవేః సత్కావ్యరత్నం హృది ॥**

**శ్లో॥ పంచాశచ్చ శతం చ పద్యమణయః పంచాపి కిం చాతులాః**
**పుణ్యా రాఘవపార్థకృష్ణవిషయా వర్ణ్యాః ప్రసిద్ధాః కథాః ।**
**చిత్రే వర్ణనయా చిదంబరకవేర్యత్కావ్యరత్నే కృతా**
**వక్త్రే దృక్సరసాశయేఽ సరలతా కుత్రేతి చింత్యా బుధైః ॥**

దీనికిఁ దండ్రి యగు ననంతనారాయణుఁ '**దర్థదీపిక**' యను వ్యాఖ్య ననుసంధించినాఁడు. ఇది తెలుఁగు లిపిలో ముద్రింపఁబడినది.

6. **పంచకల్యాణచంపువు** : ఇది యైదర్థముల కావ్యము. శ్రీరామ – శ్రీకృష్ణ – సుబ్రహ్మణ్య – శివ – విష్ణు కల్యాణము లొకేమాఱు చెప్పఁబడినవి.

**శ్లో॥ సూనోః కౌశికభూషణస్య మఖినః శ్రీసూర్యనారాయణ**
**క్షోణీందో రజనిష్ట కోవిదమణే ర్యోఽనంతనారాయణాత్ ।**
**తస్యాయం స్తబకశ్చిదంబరకవేః శ్రీచంపురత్నే కృతౌ**
**తస్యాగాత్ ప్రథమోత్తర స్తతపదశ్రీః పంచకల్యాణకే ॥**

7. **భాగవతచంపువు** : ఇది 3 స్తబకముల కావ్యము. దీని ప్రారంభ శ్లోకము లివి –

**శ్లో॥ కల్యాణమేధయతు కశ్చిదనాదివాచాం । మౌలావజస్రముఖరప్రచరప్రభావః ।**
**ఆభాతి నాగముఖతామపి యత్ర యాతే । వైచిత్ర్యశాలిని వినాయకతావిలాసః ॥**

**శ్లో॥ భద్రం కరోతు బలభద్రసహోదరో వో । రుద్రస్య చాపజడతస్సునిరూఢశక్తిః ।**
**వారాంనిధౌ ప్రకటితప్రవరోరుధామా । శ్రీరామ ఏవ సురసంశ్రితపారిజాతః ॥**

**శ్లో॥ ఆరాధితామరగణస్య సుఖేన సూర్య । నారాయణస్య వరకౌశికవంశవార్ధేః ।**
**తారావరస్య తనయస్సమభూదనంత । నారాయణస్సుతమసూత చిదంబరం సః ॥**

ఇతి చిదంబరస్య కృతౌ చంపూ భాగవతే తృతీయస్తబకః ।

ఇది ప్రస్తుతచంపూభాగవతము కంటె భిన్నమైనది. చిదంబరకవి గ్రంథాంతగద్యము లన్నియు నీవిధముగా నున్నవి. "ఇతి పదవాక్య ప్రమాణ పారావార పారీణేన శ్రీ మత్కౌశికగోత్రభూషణస్య శ్రీమత్సూర్యనారాయణదీక్షితస్య సూనోః అనంతనారాయణసుమతేః పుత్రేణ శ్రీనివాసవిద్వన్మణే రనుజేన చిదంబరకవినా విరచితాయాం..."

చిదంబరకవి శిష్యుఁడు శ్రీకంఠుఁడు (నంజుండకవి) 'మదనమహోత్సవభాణము'ను రచించి నాఁడు.

## వెల్లాల యుమామహేశ్వరశాస్త్రి

ఇతఁడు మోక్షగుండము – అక్కయ్యసూరి శిష్యుఁడు. బహుగ్రంథకర్త.

(1) భాగవత చంపువు (2) అభినవ భారత చంపువు (3) కలివిడంబనము (4) ప్రసంగరత్నాకరము (5) శృంగారశేఖరభాణము (6) భగవత్పాదసప్తతి (7) తత్త్వచంద్రిక (8) విరోధవరూథిని (9) అద్వైత కామధేనువు (10) వేదాంతసిద్ధాంతసారము మొదలగునవి వీరి కృతులు.

ఇతఁడు తత్త్వచంద్రికలో నప్పయ్యదీక్షితుల నుదాహరించినాఁడు. కాఁబట్టి 16వ శతాబ్దమునకుఁ దరువాతి వాఁడు. ఉమామహేశ్వరుని తనూజుఁడు భాస్కరదీక్షితుఁడు (1) తప్తముద్రావిద్రావణము (2) సిద్ధాంత సిద్ధాంజనవ్యాఖ్య – 'రత్నతూలిక' రచించినాఁడు. ఇతఁడు రఘునాథ నాయకుని (1614 – 1662) కాలములోని వాఁడు. కాఁబట్టి యుమామహేశ్వరుని కాలము 1600 – 1700 అని నిర్ణయింపవలసియున్నది.

ఉమామహేశ్వరశాస్త్రిని గూర్చి బ్రహ్మసూత్రభాష్య పీఠిక 'వేదాంత దర్శనము'లోఁ గొంత వివరించితిని. ఆ పీఠికలో బెల్లంకొండ వారి ప్రతిపాదనము ననుసరించి 'చిదంబర కవి'యే ప్రస్తుత చంపూ భాగవత కర్త యని నిర్ణయించితిని. అది పొరపాటు. ప్రస్తుతాధారములను బట్టి 'వెల్లాల యుమామహేశ్వర శాస్త్రి' చంపూ భాగవత కర్త యని తేలుచున్నది. చిదంబర కవి 'కౌశిక' గోత్రుఁడు. వెల్లాల యుమామహేశ్వర శాస్త్రి 'కాశ్యప' గోత్రుఁడని శృంగారశేఖరభాణమును బట్టి తెలియుచున్నది. **అస్తి కశ్యపగోత్రతిలక భూతః కశ్చి దభినవ కాళిదాసో నామ కవిః** కాఁబట్టి వీరిరువురు భిన్నులు. ఇద్దఱు కవులు రెండు చంపూభాగవతములు రచించుటచే నీతికమక యేర్పడినది.

శ్రీమాడభూషి కృష్ణమాచార్యులు – 'అభినవ కాళిదాసు' వెల్లాల కుటుంబమునకుఁజెందినవాఁడని చెప్పినారు. రత్నావళీవ్యాఖ్యాత వచనము దీని కాధారము. శ్రీ బిరుదురాజు రామరాజు మొదలగు వారు వెల్లాల యుమామహేశ్వరశాస్త్రియే ప్రస్తుత చంపూభాగవతకర్త యని పేర్కొనినారు.

**శ్లో॥ కల్యాణం నః ప్రభూతం కలయతు కుశలం...**

అను శ్లోకముతో మొదలైన ఈ చంపూ భాగవతము వెల్లాల వారి కృతి యని నిర్దేశించినారు.

శ్రీకృష్ణమాచార్యులు – (Abhinava Kalidasa (of Vellala family, appearently of the Andhra country) has not left us his real name అని చెప్పినారు. ప్రస్తుత చంపూభాగవతకర్త తన నిజనామము నెక్కడ కంఠోక్తిగాఁ జెప్పకుండుటచే నీ గ్రంథకర్తృత్వము మఱింత చిదంబర రహస్యమైనది.

**చంపూ భాగవతము**

ఈ భాగవత చంపువులో 6 విలాసములు మొత్తము 955 పద్యగద్యములు గలవు. భాగవతమునందు వలెనే పరీక్షిత్ – శుకసంవాదరూపముగాఁ గథ యారంభింపఁబడినది. కథారంభ గద్యములో భాగవతములోని 1 స్కంధము మొదలుకొని 9వ స్కంధము వఱకుఁగల కథలు సూచింపఁ బడినవి. అటుపిమ్మట శ్రీకృష్ణావతారము మొదలుకొని కుచేలోపాఖ్యానము వఱకుఁగల దశమస్కంధ కథలు సంగ్రహింపఁబడినవి. గ్రంథాంతములో **శ్రీరాధాకృష్ణులచరిత్రము** చేర్పఁబడినది. ఇది యమూలకము. విష్ణుపురాణములోఁగాని, భాగవతములోఁగాని రాధాదేవి వృత్తాంతము లేదు. దీనిని గూర్చి యొక చిన్న కథ గలదు.

శ్రీరాధాదేవి పరమభక్తురాలు. శ్రీకృష్ణుని వరించినది. రాధానామ ముచ్చరించినంతనే భక్తి–పారవశ్యముతో శ్రీశుకమహర్షికి సమాధిస్థితి వచ్చెడిదఁట! శ్రీపరీక్షిన్మహారాజునకు 7 దినములలో సంపూర్ణభాగవతము నుపదేశింపవలెను గదా! అందువలనఁ గథాభంగము కల్గకుండుటకై రాధా చరిత్రమును బరిహరించెనఁట. గర్గభాగవతము, బ్రహ్మవైవర్తపురాణములోని శ్రీకృష్ణ జన్మఖండము, పద్మపురాణము మొదలగు వానిలో రాధాదేవి కథ విస్తరముగా వర్ణింపఁబడినది. శ్రీరాధాకృష్ణులు గోలోకములో నుందు రనియు, గోలోకము వైకుంఠము కంటె నున్నత స్థితిలో నుండుననియు నీకథల సారాంశము. శ్రీ నింబార్కాచార్యుల ద్వైతాద్వైతమతము, శ్రీవల్లభాచార్యుల శుద్ధాద్వైతము, శ్రీ చైతన్య మహాప్రభుని యచింత్య భేదాభేదము మొదలగు వైష్ణవ మతములు శ్రీరాధాకృష్ణతత్త్వముపై నాధారపడినవి. లీలాశుకుని (11 శ.) శ్రీకృష్ణకర్ణామృతములో రాధాప్రశంస కలదు. జయదేవుని (11శ.) గీత గోవిందమంతయు రాధామాధవరహస్యకేళియే. ఈ వాఙ్మయముచే నాకర్షింపఁబడిన వెల్లాలకవి దీనినీ చంపూభాగవతములోఁ జేర్చినాఁడు.

గోవత్సాపహారాపరాధము పోఁగొట్టుకొనుటకై బ్రహ్మదేవుఁడు రాధాదేవిని సృష్టించి యామెను సింహళ ద్వీపాధిపతి యగు విజయవర్మకుఁ గూఁతురుగా నిచ్చెను. ఆమెను శ్రీకృష్ణున కిచ్చి వివాహము చేయ వలె నని కలలో నాదేశించెను. ఇట్లు శ్రీరాధాకృష్ణుల కల్యాణము జరిగినది. ఈ రాధాదేవి కథ యొక్కొక్క పురాణములో నొక్కొక్క విధముగా నున్నది. ఇందలి కథ కవి కల్పితమని శ్రీ బెల్లంకొండవారు స్పష్టముగాఁ జెప్పినారు.

"ఏవమ్ భాగవతప్రసిద్ధాం కుచేలోపాఖ్యానపర్యంతాం కథాం వర్ణయిత్వా సంప్రతి స్వకల్పితాం రాధామాధవవివాహాది కథాం వర్ణయిష్యన్..."

వెల్లాల కవి యీ గ్రంథమును శివ – పార్వతీస్తుతితో నారంభించినాఁడు. భోజుఁడు చంపూ రామాయణములో, అనంతభట్టు చంపూ భారతములో వినాయకునిఁ బ్రత్యేకముగా స్తుతించినారు. ఈ కవి భంగ్యంతరముగా శ్రీకృష్ణునిచే గజానన పూజ చేయించినాఁడు.

**విఘ్నేశ్వర పూజ**

**శ్లో॥ నివేశ్య తల్పే శిశిరాంశుకల్పేఽ । నల్పేహయా ప్రాణసమాం స మాయీ ।**
**నీవీవిమోక్షాయ విమోక్షదాయీ । మతంగజాస్యం హరిరారరాధ ॥ (6-141)**

శ్రీకృష్ణుఁడు సంభోగారంభములో రాధాదేవి యధరపానము గావించి కుచములు పట్టుకొని ముద్దులు పెట్టి యామెను పండువెన్నెల వంటి చల్లని తెల్లని పాన్పుపైఁ బరుండఁబెట్టి మిక్కిలి కోరికతోఁ గోకముడి విప్పుటకై వినాయకు నారాధించెను. అనఁగా సురతకేళి మొదలుపెట్టెనని భావము. భారతీయు లేపని చేసినను ముందు తొలివేల్పగు విఘ్నేశ్వరునిఁ బూజింతురు గావున గణేశ్వర పూజయనఁగా గార్యారంభము. హరి (సింహము) ఏనుఁగు ముఖమును బూజించెనని విరోధము. శ్రీకృష్ణుఁడు నిర్విఘ్నముగా ననంగసంగరము సాగుటకై గజాస్యు నారాధించె నని విరోధపరిహారము. చీరముడి విప్పి వస్త్రమును దొలఁగించినంతనే కన్నుల విందుగాఁ గనఁబడిన రాధాదేవి జఘన బింబము గజకుంభస్థలము వలె నున్నతముగా నుండుటచే ముందుగా దాని నారాధించెనని యింకొక యర్థము.

**అతివేలశృంగారము**

ఇందలి తృతీయ విలాసములో 92 శ్లోకము మొదలుకొని 137 శ్లోకము వఱకు శ్రీకృష్ణ – గోపికా విహారము వర్ణింపఁబడినది. 27 శ్లోకములలో గోపీకృష్ణ కామకేళీ విలాసము గలదు. గోపికల దేహము, తొడలు, కుచములు, అధరపానము, కుచమర్దనము మొదలగు వానినే కాక వారి నితంబ బింబములను, ఘన జఘనములను, గోప్యాంగములను పచ్చి పచ్చిగా వర్ణించినాఁడు.

ఇట్లే షష్ఠ విలాసములో 90 శ్లోకము మొదలుకొని 150 శ్లోకము వఱకు 60 శ్లోకములలో రాధామాధవరతిక్రీడను వర్ణించినాఁడు. 10 శ్లోకములలో శ్రీకృష్ణుని నర్మమర్మమధురభాషితములు, 21 శ్లోకములలో రాధాదేవి యధరము (క్రింది పెదవి), 11 శ్లోకములలో స్తనములు, 4 శ్లోకములలో నీవీమోక్షము (పోఁకముడి విప్పుట), 8 శ్లోకములలో వస్త్రస్రంసన – దిగంబరత్వములు వర్ణింపఁ బడినవి. చుంబనము, అధరపానము, కుచగ్రహణ – పీడనములు, నితంబస్పర్శనము మొదలగునవి వాత్స్యాయన కామశాస్త్రానుసారముగా వర్ణింపఁబడినవి. శ్రీకృష్ణుఁడు రాధాదేవిని నగ్నను గావించి మర్మావయవమును వర్ణించుచు వామాచారపరాయణుఁడై మధుపానము చేయించి మన్మథమంత్ర ముపదేశించి మఱియు సంభోగించినాఁడు. మూఁడు నాలుగు శ్లోకములు పఠింపుఁడు.

**శ్లో॥ ఆవిర్భవేద్యత్ర లతాసు పుష్పం । తత్రైవ దృష్టః ఫలసంభవోఽపి ।**
**ఉదేతి చిత్రం తరుణీలతే! తే । పుష్పం క్వచిత్క్వాపి శలాటుయుగ్మమ్ ॥ (3-78)**

శ్రీకృష్ణుఁ డొక్క గోపికతో నర్మముగాఁ బలుకుచున్నాఁడు. ఓ సుందరీ! లత యందుఁ బుష్పమెక్కడ పుట్టునో ఫలములు కూడ నక్కడే పుట్టును. కాని లతాంగీ! తీఁగ వంటి నీ దేహములోఁ బువ్వొక చోటఁ గాయలు మఱియొక చోట నుండుట యాశ్చర్యముగా నున్నదని భావము. శరీరమనెడి లతలో మదన మందిర మనెడి పువ్వు మొల యందు; చన్నులనెడు కాయ లెదయందు నుండుట చిత్రము. పుష్పఫలముల సామానాధికరణ్యము లోకసాధారణము. వరాంగ వక్షోజముల వైయధికరణ్యము విభ్రమహేతువు.

**శ్లో॥ నీవీం వినీయ ద్రుతమూరుమూలే । లోలేక్షణే గోపవధూకిశోరే ।**
**నిజాక్షియుగ్మం న్యమిమీలదేకా । పరా మురారేః ప్యధితాక్షియుగ్మమ్ ॥(3-107)**

శ్రీకృష్ణుఁ డిద్దఱు గోపికలతో రమించుచున్నాఁడు. శ్రీకృష్ణుఁడు వారి కోకముళ్ళు విప్పి వెంటనే తొడల మూలభాగములను జపలముగాఁ బరికించుచుండఁగా నొక గోపిక సిగ్గుతోఁ దన కన్నులు మూసికొన్నది. రెండవ గోపిక రెండుచేతులతో శ్రీకృష్ణుని కన్నులు మూసినది. మొదటి గోపిక తన మదనమందిరమును దిలకించుచున్న శ్రీకృష్ణుని జూచుటకు సిగ్గుపడి తన కన్నులు మూసికొన్నది. మఱియొక గోపిక తన గుహ్యప్రదేశమును శ్రీకృష్ణునకుఁ జూపుటకు సిగ్గుపడి శ్రీకృష్ణుని కన్నులనే మూసినది. మొదటి గోపిక బాల. రెండవ గోపిక ప్రౌఢ. అందమైన వస్తువును వీక్షించువాని కది పూర్తిగాఁ గనఁబడక పోయినచో నింకను జూడవలెననెడి కుతూహలము రేకెత్తును. రెండవ గోపిక ప్రగల్భ గావున శ్రీకృష్ణునకు స్వీయవరాంగదర్శనోత్కంఠను గనులు మూసి యుద్దీపింపఁజేసినది.

**శ్లో॥ అభావి యత్స్వాపితయాపి రత్యై । హ్రియా విముఖ్యా పరివృత్య తన్వ్యా ।**
**విలోకయన్ ముగ్ధనితంబబింబం । తదప్యభీష్టం సమమన్యతాసౌ ॥(3-109)**

శ్రీకృష్ణుఁడు సమరతి గావించుటకై యొక గోపికను శయ్యపై వెల్లగిల శయనింపఁజేసినాఁడు. ఆపాదమస్తకము తన సుందరాంగములను బరికించుచున్న శ్రీకృష్ణుని జూచి సిగ్గుతో నామె యధోముఖియై పండుకొన్నది. అప్పుడు బయటఁబడిన యామె సుందర నితంబబింబమును విలోకించి సంతోషముతోఁ దన యభీష్టము నెఱవేరిన దని శ్రీకృష్ణుఁడు భావించినాఁడు. అందమైన నున్నని పిఱుఁదులు పిసుకుచు వెనుక నుండి మార్జాలబంధముతో భోగించినాఁడని భావము.

**శ్లో॥ గుహ్యం తవ ప్రకటయామ్యధునా సుఖార్థం । కోఽప్యస్తి కామ ఇతి దైవతసార్వభౌమః ।**
**ధీరోఽపి భీరువశగో లలనాపి యాతి । పుంభావమీదృశఫలం తదుపాసనస్య ॥(6-96)**

శ్రీకృష్ణుఁడు రాధతో నర్మగర్భముగాఁ జాటూక్తులాడుచున్నాఁడు. రాధా! నీకు సుఖము గల్గుటకై యొక గుహ్యము (రహస్యము) నుపదేశించుచున్నాను. ఈ రహస్యోపదేశమునకు ఫలము సుఖమని యొక యర్థము. వస్త్రమును దొలఁగించి నీ గుహ్యమును (గోప్యాంగమును) బయలు చేయుచున్నాను. దానిని వీక్షించుట వలన నాకు మిక్కిలి యానందము గల్గునని మఱియొక భావము. ఎందువలన ననఁగా నీ గుహ్యములో దేవతాసార్వభౌముఁడగు నొకానొక కాముఁడు కాఁపురమున్నాఁడు. ఆఁడువారి రహస్యావయవము మన్మథగృహము గదా! ఆ మన్మథు నుపాసించినచో ధీరుఁడు కూడ

భయశీలుఁడగుచున్నాఁడు. విద్వాంసుఁడు కూడ భీరువులగు స్త్రీలకు వశుఁడగుచున్నాఁడు. స్త్రీ కూడఁ బురుష భావము పొందుచున్నది – అని యొక యర్థము. కామోపాసన వలన లలన కూడఁ బురుషుని వలె నుపరిసురతము గావించుటకు సమర్థురాలగు చున్నదని మఱియొక యర్థము. ఇది యంతయు మన్మథు నారాధించుట వలన వచ్చు ఫలితము. అట్టి మన్మథుఁడు నీ గుహ్యములో నివసించు చున్నాఁడు. కాఁబట్టి నీ గుహ్యమును బ్రకటించి రతికేళి సల్పుట వలన నాకానందము లభించునని శ్రీకృష్ణుని భావము.

ఇట్టి రహస్యాంగవర్ణనము శ్రీ శ్రీహర్షుని నైషధము నందును గలదు.

**శ్లో॥ స ప్రియోరుయుగకంచుకాంశుకే । న్యస్య దృష్టిమథ సిష్మియే నృపః ।**
**ఆవవార తదథాంబరాంచలైః । సా నిరావృతిరివ త్రపావృతా ॥ (నైషధ 18-47)**

నలుఁడు దమయంతి తొడల జంటపైఁగప్పిన వస్త్రము వైపు దృష్టి సారించి కొంటెగా నవ్వెను. దమయంతి వివస్త్రకాకున్నను దన రహస్యాంగమును నలుఁడు చూచుచున్నాఁడను సిగ్గుతోఁ దొడలమధ్య భాగమును బయ్యెద కొంగుతోఁ గప్పుకొనెను.

**శ్లో॥ బహ్వమాని విధినాపి తావకం । నాభిమూరుయుగమంతరాంగకమ్ ।**
**స వ్యధాదధికవర్ణకైరిదం । కాంచనైర్యదితి తాం పురాహ సః ॥ (నైషధ 18-99)**

నలుఁడు సంభోగారంభసమయములో దమయంతి కామమందిరమును జూచి యానందముతోఁ బలికిన రహస్యోక్తి. "ఓ ప్రేయసీ! నీ బొడ్డునకుఁ దొడలజంటకు మధ్యలో నున్న సుందరమైన వరాంగమును నా వలెనే బ్రహ్మదేవుఁడు కూడ బహుమానించినాఁడు. అందువల్లనే యెక్కువ వన్నెగల బంగారముతో దానిని నిర్మించినాఁడు".

ఎల్లప్పుడు వస్త్రముచే నావరింపఁబడుట వలన, నుష్ణశీతాది సంబంధము లేకుండుట వలన నిర్లోమమగుట వలనఁ దక్కిన దేహముకంటె దమయంతి మర్మాంగము పచ్చ బంగారు ఱేకువలెఁ దళతళ మెఱసినదని భావము. భర్త సురతకేళీవేళలో ముద్దియ నాపాదమస్తకము ముద్దు పెట్టు కొనుచు స్తనములు, మదనసదనము మొదలగు సుందరావయవముల యందము మెచ్చుకొనుచు వర్ణించుట స్త్రీకి మన్మథోద్దీపకము. ఇది యశ్లీలమైనను రహస్యక్రీడలో వర్ణించుట దోషము కాదని వ్యాఖ్యాతలు చెప్పినారు.

**శ్లో॥ ముఖాదారభ్య నాభ్యంతం చుంబం చుంబమతృప్తవాన్ ।**
**న ప్రాపం చుంబితుం యత్తే ధన్యా తచ్చుంబతు స్మృతిః ॥ (నైషధ - 20-92)**

నలుఁడు పలుకుచున్నాఁడు. ఓ కామినీ! ముఖమునుండి నాభివఱకు నీయవయవములను ముద్దాడి ముద్దాడి తృప్తి లేక నీవు సిగ్గుతో హస్తములతో మూయుట వలన దేనిని ముద్దాడ లేకపోయితినో యా మర్మాంగమును ధన్యమైన నీ స్మృతి చుంబించుఁగాక! ఆ వరాంగము నీకు జ్ఞాపకము వచ్చుఁగాక! యని భావము. **ముఖ – అక్షి – కక్షా – కుచ – నాభిమూల – వరాంగ భాగములు చుంబన స్థానము లని కామశాస్త్రము.** ఈ శ్రీహర్షుని ప్రభావము వెల్లాల కవిపై నెక్కువగాఁ బడినది. అత్యద్భుత

శృంగారరసపోషణములో భాగవతచంపువు నైషధీయచరితమును మించి పోయినది. శృంగార వర్ణనమునకే రాధాచరిత్రము నీకవి గ్రంథాంతములోఁజేర్చుకొనినాఁడు.

**రాసక్రీడారహస్యము**

శ్రీకృష్ణుఁడు పరకాంతలగు గోపికలతో రాసక్రీడలు సలుపుట దోషము గాదా? యని కొందఱు ప్రశ్నింతురు. ఈ ప్రశ్న పరీక్షిత్తే వేసినాఁడు. శ్రీ శుకమహర్షి సమాధానము చెప్పినాఁడు.

త్రేతాయుగములో దివ్యమంగళవిగ్రహుఁడగు శ్రీరామచంద్రుని సౌందర్యమునకు ముగ్ధులై దండకారణ్యవాసులగు మునులు కామించిరి. ఆ మునులే ద్వాపర యుగములో గోపికలుగా జన్మించిరి. వారి కోరికను శ్రీకృష్ణుఁడు సఫలము చేసినాఁడు. రాసకేళిలో మునిఁగి తేలిన గోపికలను వారి భర్తలే శంకింపలేదు.

**శ్లో॥ తదా సదనమాసేదు । ర్ముదితాః ప్రమదా అపి ।**
**అపి తస్యానుభావేన । పతివాల్లభ్యమభ్యయుః ॥ (చం.భా.3-141)**

అని యీ చంపూకర్తయే స్పష్టము చేసినాఁడు.

శ్రీకృష్ణుఁడు పరమాత్మ. గోపికలు జీవాత్మలు. శ్రీకృష్ణ - గోపీ సాంగత్యము పరమాత్మ - జీవాత్మ సమైక్యము. గోపికల పతులు కూడ జీవాత్మలే. శ్రీకృష్ణునకు గోపికాలింగనము స్వాత్మాలింగనము వంటిది. శ్రీకృష్ణుఁడు సర్వాత్ముఁడగుటచే గోపికల భర్తలు కూడ నాత్మస్వరూపులే కావున గోపికలకు శ్రీకృష్ణుఁడు కూడ స్వభర్త వంటి వాఁడే. అందువల్లనే శ్రీకృష్ణ సంగతలగు గోపికలను వారి భర్తలు సందేహింపలేదు సరిగదా యింకను వాల్లభ్యముతో సమాదరించినారు. ఇది శ్రీకృష్ణ మాయా మాహాత్మ్యము.

బ్రహ్మదేవుఁడు గోవత్సములను గోవులను మాయముచేసి పరీక్షించు నాఁటికి బలరామ - కృష్ణులు పౌగండ వయస్కులు - ఐదేండ్ల యీడు వారు. గోవర్ధనోద్ధరణ సమయమునకు శ్రీకృష్ణుఁడేడేండ్ల బాలుఁడు.

**కం॥ ఏడేండ్ల బాలుఁడెక్కడ?**
**క్రీడం గిరి తమ్మి యెత్తు క్రియ నిందఱముం**
**జూడ గిరి యెత్తు టెక్కడ?**
**వేడుక నొకచేత నేఁడు వెఱఁగౌఁ గాదే! (భాగ. 10.1.930)**

అటుపిమ్మట రాసకేళి. కంససంహారమైన పిదప బలరామకృష్ణులకు వడుగు, విద్యాభ్యాసము జరిగినవి. రాసక్రీడా సమయమునకు శ్రీకృష్ణుఁ డనుపనీతుఁడు. బ్రహ్మచారి కూడఁగాదు. పసి-బాలుఁడే. బాలుఁడయ్యును మాయావిగ్రహముతో గోపికలతో రమించి తనియించినాఁడు. అట్టి బాలునితో రతి మాయయే కాని లౌకికసంభోగము వంటిది కాదు. దీనినే బెల్లంకొండ వారిట్లు చెప్పిరి-

**కృష్ణస్య సర్వాత్మత్వేన స్వాత్మాభిన్నత్వాత్ కృష్ణేన సంగతాస్తాః స్వాత్మసంగతా ఇవ పతయో మేనిరే... వస్తుతస్తు శ్రీకృష్ణస్య పంచహాయనత్వాద్ బాలత్వాత్ తస్మిన్ గోపానామపోహాయాః సంభావనైవ న సంభవతీతి జ్ఞేయమ్ ॥**

శ్రీ వ్యాసమహర్షి యిట్లు చెప్పినాఁడు–

**శ్లో॥ గోపీనాం తత్పతీనాం చ సర్వేషామేవ దేహినామ్ ।**
**యో౽ంతశ్చరతి సో౽ధ్యక్షః క్రీడనేనేహ దేహభాక్ ॥**

**శ్లో॥ అనుగ్రహాయ భూతానామ్ మానుషం దేహమాస్థితః ।**
**భజతే తాదృశీః క్రీడా యాః శ్రుత్వా తత్పరో భవేత్ ॥**

**శ్లో॥ నాసూయన్ ఖలు కృష్ణాయ మోహితాస్తస్య మాయయా ।**
**మన్యమానాః స్వపార్శ్వస్థాన్ స్వాన్ స్వాన్ దారాన్ వ్రజౌకసః ॥** (భాగ.10-పూర్వ33అధ్యా-36-38)

పోతనగారిట్లు చెప్పినారు–

**వ॥ ఇట్లా శరత్కాలంబున వెన్నుం డింద్రియ స్ఖలనంబు సేయక గోపికల తోడ రమించె... ...**

**ఆ.వె॥ గోపజనములందు గోపికలందును**
**సకల జంతులందు సంచరించు**
**నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు?**
**సర్వమయుఁడు లీల సలిపెఁగాక. (భాగ 10.1.1107)**

మఱియును భగవద్రతి భక్తియే యగును గాని లౌకికశృంగారము గాదు. కాఁబట్టి శ్రీకృష్ణుఁ డెప్పుడు నస్ఖలిత బ్రహ్మచారియే – ఇత్యలం పల్లవితేన.

మఱియు నిక్కడ నింకొక్క విషయము విచారింపవలెను. దీనిలో రాధామాధవకేళి విస్తరముగా వర్ణింపఁబడినది. వరుసగా 8 శ్లోకములలో (1) స్తంభము (2) ప్రళయము (3) రోమాంచము (4) స్వేదము (5) వైవర్ణ్యము (6) వేపథువు (7) అశ్రువు (8) వైస్వర్యము నను సాత్త్వికభావములు వర్ణింపఁ బడినవి.

(1) స్తంభే పురా యో హవిరావిరాసీత్ । స్తంభో౽ధునా తత్ర హరౌ చకాస్తే ॥ (6-81)

(2) యదాజ్ఞయా స్యాత్ ప్రళయస్తమీశః । (6-82)

(3) విజృంభితో౽భూత్ ప్రతిలోమహర్షః । (6-83)

(4) స్వేదాంబుపూరః ప్రససార శౌరేః । (6-84)

(5) కృష్ణే వివర్ణతా ప్రాదురభూత్తదానీమ్ । (6-85)

(6) త్రిజగద్వ్యాపినమప్యకంపయత్ । (6-86)

(7) అనర్గళం నేత్రపథాత్ ప్రవృత్తా । యతో ముకుందస్య తదాస్రధారా । (6-87)

(8) వైస్వర్యమప్యస్య తదావిరాసీత్ । (6-88)

ఇక్కడ – ఇత్యష్టభిః శ్లోకైః క్రమేణ స్తంభ – ప్రళయ – రోమాంచ – స్వేద – వైవర్ణ్య – వేపథు – అశ్రు – వైస్వర్య నామకా అష్టౌ సాత్త్వికభావా వర్ణితాః। – అని బెల్లంకొండవారు చెప్పినారు.

ప్రథమసంభోగసమయములో నీయష్టవిధ సాత్త్వికభావములు నలంకార శాస్త్రములో స్త్రీలకే చెప్పఁ బడినవి కాని పురుషులకుఁ జెప్పఁబడలేదు. కాని యీ గ్రంథమునందు రాధయందుఁ గాక శ్రీకృష్ణునియం దివి వర్ణింపఁబడినవి. ఇది దోషము కాదా? యన్నచో వినుఁడు–

**శ్లో॥ ఆసీద్వరః కంటకిత ప్రకోష్ఠః । స్విన్నాంగులిః సంవవృతే కుమారీ ।**
**తస్మిన్ ద్వయే తత్క్షణమాత్మవృత్తిః । సమంవిభక్తేవ మనోభవేన ॥ (రఘు – 7-22)**

ఇది యజేందుమతుల వివాహవర్ణనము. పురోహితుఁడు వధూవరులను గలిపినాఁడు. అప్పు డజమహారాజునకు రోమహర్షణము, ఇందుమతికి స్వేదోద్గమము గలిగినట్లు కాళిదాసు రఘువంశములో వర్ణించినాఁడు.

**శ్లో॥ రోమోద్గమః ప్రాదురభూదుమాయాః । స్విన్నాంగులిః పుంగవకేతురాసీత్ ।**
**వృత్తిస్తయోః పాణిసమాగమేన । సమం విభక్తేవ మనోభవేన ॥ (కుమార – 7-77)**

ఇది పార్వతీపరమేశ్వరుల వివాహవర్ణనము. పాణిగ్రహణసమయములోఁ బార్వతికి రోమాంచ మయ్యెను. శివునకు స్వేదోదయమయ్యెనని యా కాళిదాసే వ్యుత్క్రమముగా వర్ణించినాఁడు.

వాత్స్యాయనమహర్షి –

**కన్యాతు ప్రథమసమాగమే స్విన్నాంగులిః స్విన్నముఖీ చ భవతి; పురుషస్తు రోమాంచితో భవతి। ఏభిరనయోర్భావమ్ పరీక్షేత్ ॥**

ప్రథమసంభోగసమయములో స్త్రీకిఁ జెమట పట్టును; పురుషునకు వెంట్రుకలు నిక్కఁబొడుచును. దీనిని బట్టి వారి భావము పరీక్షింపవలెనని చెప్పినాఁడు. కాళిదాసు వధూవరు లిరువరి యందు స్వేద – రోమాంచములు వర్ణించినాఁడు. అందువల్లనే మల్లినాథుఁడు–

స్త్రీపురుషయోః స్వేద రోమాంచాభిధానం సాత్త్వికమాత్రోపలక్షణమ్ । న తు ప్రతినియమో వివక్షితః ॥

స్త్రీ పురుషు లిరువరి యందు సాత్త్విక భావములు సమానముగా నుండును. నియమముగా నొకరి యందే యుండి మఱియొకరి యందుండ వని చెప్పలేము – అని చెప్పినాఁడు.

కాఁబట్టి స్తంభాది సాత్త్విక భావములు స్త్రీ పురుషోభయసాధారణములు. ఇవి నాయికా నాయకుల వయోభావావస్థల ననుసరించి యుండును. భర్త ప్రౌఢుఁడై భార్య బాలయైనచో స్త్రీయందే సాత్త్విక భావోదయమగును. స్త్రీ ప్రౌఢయై భర్త బాలుఁడైనచోఁ బురుషునియందే సాత్త్విక లక్షణము లుండును.

కం॥ జలజాక్షుల యందుఁ బొడము సాత్త్విక భావంబులు (నరస – 3-38)

అని యలంకారశాస్త్రములో స్త్రీలయందు మాత్రమే వీనిని నిరూపించుట ప్రాయికము. నియమము గాదు. మఱియు రాధాదేవి నందునకుఁ జెల్లెలని, శ్రీకృష్ణునకు మేనత్త యని (సాక్షాత్తుగాఁగాదు) వయస్సులోఁబెద్దదని కొన్ని పురాణములు చెప్పినవి. ఇక్కడ శ్రీకృష్ణుఁడు ముగ్ధుఁడు. రాధ ప్రౌఢ. కావున దోషము లేదు.

**వ్యాకరణశాస్త్రము** : వెల్లాల కవి మహావైయాకరణుఁడు. ఈ కావ్యములో నపురూపములైన ప్రయోగము లనేకములు గలవు.

(1) అభినవపదపూర్వః కాళిదాసః ప్రగల్భః (1-7)

అభినవ – పదము – పూర్వముగాఁ గల కాళిదాసు = అభినవకాళిదాసు. 'దశరథుఁ'డను దానికి 'దశపూర్వరథం యమాఖ్యయా' (రఘు-8-20) అని; 'దేవానీకుఁ'డను దానికి 'వ్యశ్రూయతానీక పదావసానం దేవాదినామ' (రఘు-18-10) అని; 'దేవగిరి' యనుదానికి 'దేవపూర్వం గిరిం తే' (మేఘ – 48) అని; 'రాజముని' యను దానికి 'పుణ్యః శబ్దో ముని రితి ముహుః కేవలం రాజపూర్వః' (అభిజ్ఞాన – 2-14) అని కాళిదాసు ప్రయోగించినాఁడు.

'ధనుర్వేద' మనుదానికి 'ధనురుపపదమస్మై వేదమభ్యాదిదేశ' (కిరాత – 18-44) అని భారవి ప్రయోగించినాఁడు. 'హిరణ్యకశిపు' – అను దానికి 'హిరణ్యపూర్వం కశిపుం ప్రచక్షతే' (శిశు – 1-42) అని మాఘుఁడు ప్రయోగించినాఁడు. 'ఖాండవప్రస్థ' మను దానికి – 'ప్రస్థం యయౌ ఖాండవశబ్ద-పూర్వమ్' (చం.భార – 3-1) అని యనంతభట్టు ప్రయోగించినాఁడు.

ఇది పూర్వకవి వాక్ ప్రయోగదక్షత.

(2) **శ్లో॥ దదం కల్యాణానాం దధమపి కృపాయా నిరవధే-**
**ర్హనం క్రవ్యాదానాం పిబమపి భవాబ్ధేశ్శ్రితవతామ్ ।**
**శ్రియః పశ్యం భూయస్సకలజగతీధారయమసౌ**
**విధిస్స్తావం స్తావం మధురిపుమనంసీత్సవినయమ్ ॥ (1-30)**

కల్యాణములను – దదం = ఇచ్చు వానిని; నిరవధికృపను – దధం = ధరించు వానిని; క్రవ్యాదులను – రాక్షసులను – హనం = చంపు వానిని; భవాబ్ధిని – సంసారసముద్రమును – పిబం = త్రాగు వానిని; లక్ష్మిని – పశ్యం = చూచు వానిని; సకల జగత్తులను – ధారయం = ధరించు వానిని; విధిః = బ్రహ్మ; స్తావం స్తావం = స్తుతించి స్తుతించి; అనంసీత్ = నమస్కరించెను.

ఇక్కడ ధాతువులు ద్వితీయాంత ప్రాతిపదకములుగా వాడఁబడుట విశేషము.

(3) **శ్లో॥ ఇతి స్తావం స్తావం ప్రతిముహురనంసీన్మురరిపుం**
**దృశా పాయం పాయం చిరమపి న సౌహిత్యమగమత్ ।**
**సుఖం ధ్యాయం ధ్యాయం కృతినమయమాత్మానమభజ-**
**ద్రిపుం స్మారం స్మారం వ్యథితపరమత్యాహితమపి ॥ (1-94)**

స్తావం స్తావం = స్తుతించి స్తుతించి; పాయం పాయం = త్రాగి త్రాగి; ధ్యాయం ధ్యాయం = ధ్యానించి ధ్యానించి; స్మారం స్మారం = స్మరించి స్మరించి.

ఇవి 'ఆభీక్ష్ణ్యే ణముల్ చ' (3-4-22) అను సూత్రముచే నేర్పడిన 'ణము' లంతములగు ధాతురూపములు. ణములంతము లెప్పుడు జంటలు జంటలుగాఁ బ్రయోగింపఁబడును.

ఇట్లే 'పయః స్వాదం స్వాదం' (2–26) అను శ్లోకములో స్వాదం స్వాదం = ఆస్వాదించి యాస్వాదించి – అను రూపము గలదు. పాయం పాయం రుచిమపి తనోర్గ్లానబాలేందు లీలాం (2–34) అను శ్లోకములో – పాయం పాయం = త్రాగి త్రాగి (చూచి చూచి); శ్రావం శ్రావం = విని విని; చుంబం చుంబం = ముద్దాడి ముద్దాడి; శ్లేషం శ్లేషం = కౌఁగిలించి కౌఁగిలించి – అను రూపములు వాడఁబడినవి.

(1) ఉపవీణయంతం (1–53)
(2) బిభరాంబభూవ (1–63)
(3) అరుంతుద (1–116; 3–184)
(4) తాతసద్మీయతి; మిత్రగృహీయతి (1–133)
(5) జరీజృంభత్ (1–152)
(6) అకుతోభయ (2–50)
(7) ముష్టీముష్టి (2–60)
(8) బుబుధేతరామ్ (2–71)
(9) చిత్రీయమాణచిత్తః (2–75)
(10) సమూలకాష మకషతామ్ (2–91)
(11) పశ్యతోహర (2–127)
(12) పశుమారం మారయిత్వా (3–144)
(13) విరచితాభిషేణనాః (5–40)
(14) సుగ్రీవమిత్రధేయం (5–67)
(15) అభ్యమిత్రీణః (6–5)

మొదలగు ప్రయోగములు వైయాకరణులను మురిపించినవి.

వీని ప్రక్రియ యిందలి మంథరవ్యాఖ్యలోఁగలదు.

మాఘుని 'శిశుపాలవధము' ; మురారి 'యనర్ఘరాఘవము' తరువాత నిన్ని విచిత్రవ్యాకరణ ప్రయోగములు గల కావ్యము చంపూభాగవతము మాత్రమే.

బెల్లంకొండ రామరాయకవి సిద్ధాంతకౌముదికి 'శరద్రాత్రి' వ్యాఖ్యను రచించిన శాబ్దికశిరోమణులు. ఈ భాగవతచంపువునకు మంథర వ్యాఖ్యను రచించినట్లే యనర్ఘరాఘవమునకుఁ గూడ వ్యాఖ్యానము రచించిరఁట. ఇది యింతవఱకు లభింపకుండుట మన దురదృష్టము.

**జ్యోతిషశాస్త్రము :**

**శ్లో॥ కన్యారాశిరసౌ నైవ । భౌమభోగార్హతామగాత్ ।**
**విధుస్స్వగృహబుద్ధ్వాతు । బుభుజే విస్మయాయ తత్ ॥ (4–155)**

కన్యారాశి = (1) కన్యల సమూహము (2) జ్యోతిశ్చక్రము నందలి కన్యారాశి

భౌముఁడు = భూమి పుత్త్రుఁడు = (1) నరకుఁడు (2) కుజుఁడు

విధుఁడు = (1) చంద్రుఁడు (2) శ్రీకృష్ణుఁడు

గృహము = (1) ఇల్లు, (2) భార్య

నరకాసురుఁడు 16000 రాజకన్యలను బంధించి చెఱలోఁబెట్టినాఁడు. శ్రీకృష్ణుఁడు నరకాసురుని వధించి యారాజకన్యలను విడిపించి పెండ్లాడినాఁడు. రాజకన్యాసమూహమును భౌముఁడు (నరకాసురుఁడు) అనుభవింపలేక పోయెను. శ్రీకృష్ణుఁడు మాత్రము వారిని స్వభార్యలుగా భావించి భోగించెను. ఇది భాగవత పరమగు నర్థము.

(1) మేషము (2) వృషభము (3) మిథునము (4) కర్కాటకము (5) సింహము (6) కన్య (7) తుల (8) వృశ్చికము (9) ధనుస్సు (10) మకరము (11) కుంభము (12) మీనము – ఇవి ద్వాదశ రాశులు. భౌముఁడు – భూమి పుత్త్రుఁడగు కుజునకు మేష – వృశ్చికములు స్వగృహములు. చంద్రునకుఁ గర్కాటకము స్వగృహము. బుధునకు మిథున – కన్యలు స్వీయగృహములు. కన్యారాశి కుజునిల్లు కాకపోవుటచే భోగ్యస్థానము కాలేదు. చంద్రునకు (శ్రీకృష్ణునకు) కన్యారాశి స్వగృహము కాకపోయినను భోగ్యార్హమయ్యెను. **ఇది యాశ్చర్యమని జ్యోతిశ్శాస్త్రపరమగునర్థము.**

**గద్యము** – భార్గవమివ రవితనయానురాగిణ మృక్షరాజసుతానురాగిణమ్ (5–2)

ఇది రుక్మిణి సేవించిన శ్రీకృష్ణుని వర్ణనము.

భార్గవుఁడు = (1) శుక్రుఁడు (2) పరశురాముఁడు.

రవితనయ = కాళింది. రవితనయుఁడు = కర్ణుఁడు.

ఋక్షరాజు = (1) జాంబవంతుఁడు (2) చంద్రుఁడు

ఋక్షరాజతనయ = జాంబవతి. ఋక్షరాజు తనయుఁడు = చంద్రుని కొడుకు బుధుఁడు.

శ్రీకృష్ణుఁడు శుక్రునివలె రవితనయానురాగి=కాళింది యం దనురాగము కలవాఁడు. భార్గవుఁడు (పరశురాముఁడు) కర్ణుని యం దనురాగము గలవాఁడు. కర్ణుఁడు పరశురాముని శిష్యుఁడు.

శ్రీకృష్ణుఁడు ఋక్షరాజసుతానురాగి = జాంబవతి యం దనురాగము గలవాఁడు. భార్గవుఁడు = శుక్రుఁడు. ఋక్షరాజ సుతానురాగి = నక్షత్రములకు నాథుఁడైన చంద్రుని యొక్క కొడుకైన బుధునియం దనురాగము గలవాఁడు.

'బుధశుక్రయోర్మిత్రత్వం జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధమ్' అని బెల్లంకొండ వారి మంథరవ్యాఖ్య.

**వేదాంతశాస్త్రము :**

**శ్లో॥ పురాణో నీరూపస్త్వమసి విగుణో నైవ వశగః (1–89)**

**శ్లో॥ సతో దుఃఖస్యాంతో నహి సుఖమసద్వా తవ విభో (2–80)**

**శ్లో॥ పురాణస్త్వం మాయా తవ చ గృహిణీ త్వం చ నితరామ్ (2–81)**

**శ్లో॥ పురాణస్త్వం జాయా ప్రకృతిరసతీ హంత నిఖిలా (2–83)**

**శ్లో॥ సతీ చేల్లోకానాం న భవతి హి బాధాస్తిరసతీ (3–47)**

**శ్లో॥ అపాణిర్గృహ్ణాసి త్వరితమపదో ధావసి విదృక్ (4–74)**

మొదలగు శ్లోకములలో వేదాంతతత్త్వము ప్రతిపాదింపఁబడినది. శ్రీ బెల్లంకొండ వా రుపనిషత్తులను భగవద్గీత నుదాహరించి విస్తరముగా వివరించినారు.

**గద్యము** – న్యాయదర్శన ఇవ జాతిమాలానపేతే (5–2)

ఇక్కఁడ దర్కశాస్త్రము పరిచయము చేయఁబడినది.

ఇక్కడ శ్రీకృష్ణపర్యంకమునకు న్యాయదర్శనమునకు శ్లేష.

జాతులు = జాజిపువ్వులు. అసదుత్తరములు.

జాజిపూలతో నున్నది శ్రీకృష్ణ శయ్య. చెడు సమాధానములను జాతులలోఁ గూడినది న్యాయ దర్శనము.

**గద్యము** – విష్వక్సేనమపి ప్రకటితాద్వైతతత్త్వమ్ (3–15)

ఇక్కడ విశిష్టాద్వైత – అద్వైత – బౌద్ధమతముల పరిచయము గలదు. విష్వక్సేనమపి విష్ణుమ్ । 'విష్వక్సేనో జనార్దన' ఇత్యమరః । విశిష్టాద్వైతమతస్థాపకం విష్వక్సేనాచార్యమితి చ । ప్రకటితాద్వైతమ్ ప్రకటీకృతాభేదం 'సర్వం ఖల్విదం బ్రహ్మేతి' శ్రుతేరితి భావః । ఏతేనాద్వైతమతవ్యవస్థాపకవ్యాసావతారో వర్ణితః । యద్వా బుద్ధావతార ఏవానేన వర్ణితః – 'దశబలోఽద్వయవాదీ వినాయక' ఇతి ॥ అని శ్రీ బెల్లంకొండ వారి వ్యాఖ్య.

ఈ వాక్యముల వలన గ్రంథకర్త సకలశాస్త్రవైదుష్యము వ్యక్త మగుచున్నది.

### పూర్వకవుల ప్రభావము

(1) **వాల్మీకి** :

శ్లో॥ రామో విగ్రహవాన్ ధర్మో రామః సత్యపరాక్రమః । (వా.రా.అరణ్య– 37–13)

శ్లో॥ క్రమేణ వవృధే శౌరిర్ధర్మో విగ్రహవానివ (చం.భా. 1–129)

శ్రీరాముఁడు ధర్మవిగ్రహుఁడని వాల్మీకి చెప్పఁగా శ్రీకృష్ణుఁడు ధర్మవిగ్రహుఁడని చంపూకర్త చెప్పినాడు.

(2) **భోజరాజు (11శ.)** :

శ్లో॥ నారాయణాయ నలినాయతలోచనాయ । నామావశేషితమహాబలివైభవాయ ।
నానాచరాచరవిధాయకజన్మదేశ । నాభీపుటాయ పురుషాయ నమః పరస్మై ॥ (చం.రా.1-16)

ఇది చంపూరామాయణములో దేవతలు గావించిన నారాయణస్తవము.

***శ్లో॥ దామోదరాయ దమితామితదానవాయ । దారిద్ర్యదావదహనాయ దయాపరాయ ।***
***దూరీకృతాతిదురితాయ దురాసదాయ । దద్యాం నమస్సపది దారుణదారణాయ ॥(చం.భా1-69)***

ఇది దేవకీగర్భములో నున్న శ్రీకృష్ణుని బ్రహ్మాది దేవతలు గావించిన స్తోత్రము.

(3) **లీలాశుకుఁడు (11శ.) :**

**శ్లో॥ రామో నామ బభూవ; హుం; తదబలా సీతేతి; హుం; తాం పితు**
**ర్వాచా పంచవటీతటే విహరతస్తస్యాహరద్రావణః ।**
**నిద్రార్థం జననీకథామితి హరేర్హుంకారతః శృణ్వతః**
**సౌమిత్రే! క్వ ధనుర్ధనుర్ధను? రితి వ్యగ్రా గిరః పాంతు వః ॥ (శ్రీకృష్ణకర్ణా . 2–72)**

లీలాశుకుఁడు యశోదచే శ్రీకృష్ణునకు రామావతారకథ చెప్పించినాఁడు.

**శ్లో॥ గాయంతీ వివిధాః కథా మురరిపోః పూర్వావతారాశ్రితా**
**డోలాచాలనమాదధే యదుదయన్మోదా యశోదా శిశోః ।**
**శ్రుత్వైతత్సుఖపారవశ్యమభజద్యద్వా స తంద్రీచ్ఛలా**
**దాకల్పం వితనోతు న స్తదుభయం కల్యాణపారంపరీమ్ ॥ (చం.భాగ - 2-30)**

వెల్లాలకవి యశోదచే శ్రీకృష్ణునకుఁ బూర్వావతారకథలు చెప్పించినాఁడు.

**శ్లో॥ మాతః! కిం యదునాథ? దేహి చషకం; కిం తేన? పాతుం పయ-**
**స్తన్నాస్త్యద్య; కదాస్తి వా? నిశి; నిశా కా? వాంధకారోదయః ।**
**ఆమీల్యాక్షియుగం నిశాప్యుపగతా దేహీతి మాతుర్ముహు-**
**ర్వక్షోజాంశుకకర్షణోద్యతకరః కృష్ణస్స పుష్ణాతు నః ॥ (శ్రీకృష్ణకర్ణా. 2-60)**

తల్లీ! శ్రీకృష్ణా! ఏమి? నాకు గిన్నె నిమ్ము. దేనికి? పాలు త్రాగుటకు. ఇప్పుడు పాలు లేవు. మఱి యెప్పుడుండును? రాత్రి. రాత్రియనఁగా నేమి? చీఁకటి పడుట. ఈ విధముగా యశోద చెప్పిన మాటలు విని శ్రీకృష్ణుఁడు కన్నులు మూసికొని రాత్రి వచ్చినది. పాలిమ్ము! అని యామె పైఁట కొంగు లాగుటకై చేయి సాచినాఁడు. ఆ కృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాక!

**శ్లో॥ మాతర్దేహి పయశ్శిశో! కిమధునా వర్తేత దుగ్ధం? కదా?**
**తర్హ్యాయాతు పితృప్రసూః, కిమధునా తాతప్రసూర్జీవతి? ।**
**నో సాయం, కిమిదం తమఃప్రకటతా, సా గర్భగేహే స్ఫుటే**
**త్యాలాపోఽస్తు యశోదికాతనయయోర్న్రశ్శ్రేయసే భూయసే ॥ (చం.భాగ.2-29)**

అమ్మా! పాలిమ్ము! శిశూ! ఇప్పుడు పాలుండునా? మఱియెప్పుడుండును? సాయంకాలము - మీ నాయనమ్మ వచ్చిన పిదప. ('సాయంసంధ్యా పితృప్రసూః'; పితృప్రసూః నందమాతా - నాయనమ్మ). ఇప్పుడు నాయనమ్మ బ్రతికి యున్నదా? నాయనమ్మ కాదు. సాయంకాలము. సాయంకాల మనఁగా నేమి? చీఁకటి పడుట. చీఁకటి యింటిలోపల నున్నది కదా! పాలు తెమ్ము! ఈ విధముగా యశోదా - శ్రీకృష్ణుల యాలాపములు మా కెక్కువ శ్రేయస్సు (మోక్షము) కలిగించుఁగాక!

**శ్లో॥ యజ్ఞై రీజిమహే ధనం దదిమహే పాత్రేషు నూనం వయం**
**వృద్ధాన్ భేజిమహే తప శ్చకృమహే జన్మాంతరే దుశ్చరమ్ ।**
**యేనాస్మకమభూదనన్యసులభా భక్తిర్భవద్వేషిణీ**
**చాణూరద్విషి భక్త కల్మషముషి శ్రేయః పుషి శ్రీజుషి ॥ (శ్రీకృష్ణ కర్ణా. 2-99)**

**శ్లో॥ న కర్మ రచయామహే న చ తపాంసి శిక్షామహే**
**న దైవతముపాస్మహే న హృది కించిదాశాస్మహే ।**
**మహః కిమపి మంగళం పరమమంగళానామపి**
**త్రిలోచనతపఃఫలం హృది విధాతుమీహామహే ॥ (చం.భాగ.2-131)**

శ్లో॥ **మల్లై శ్శైలేంద్రకల్పః శిశు రితరజనైః పుష్పచాపోఽంగనాభి-**
**ర్గోపైస్తు ప్రాకృతాత్మా దివి కులిశభృతా విశ్వకాయోఽప్రమేయః ।**
**క్రుద్ధః కంసేన కాలో భయచకితదృశా యోగిభిర్ధ్యేయమూర్తి-**
**ర్దృష్టో రంగావతారే హరిరమరగణానందకృత్ పాతు యుష్మాన్ ॥ (శ్రీకృష్ణకర్ణా.2-103)**

మల్లులచేఁ బర్వతము వంటి వాఁడుగా; తక్కిన జనులచే బాలుఁడుగా; స్త్రీలచే మన్మథుఁడుగా; గొల్లలచే సామాన్య పురుషుఁడుగా; స్వర్గము నందలి యింద్రునిచే నూహ కందని విశ్వవిగ్రహుఁడుగా; భయముతోఁ జూచుచున్న కంసునిచేఁ గోపించిన యముఁడుగా; యోగులచే ధ్యానము చేయఁదగిన భగవంతుఁడుగా యుద్ధరంగములో వీక్షింపఁబడినవాఁడు దేవతాసమూహమున కానందము గూర్చువాఁడు నగు శ్రీకృష్ణుఁడు మిమ్ము రక్షించుఁగాక!

శ్లో॥ **కామిన్యః కుసుమాస్త్రవిభ్రమధురీసర్వస్వసారాస్పదం**
**సంసారాహితశోకశీర్ణహృదయాః కారుణ్యవారాన్నిధిమ్ ।**
**మల్లాః కల్పవిరామకాలవిలసత్కాలాగ్నిరుద్రాకృతిం**
**ముగ్ధం దుగ్ధగళం శిశుం చ పితరౌ గోపాస్సఖాయం స్వకమ్ ॥**

శ్లో॥ **తత్త్వం దుర్గమమాగమాగమశిఖాశాఖాప్రవాళం బుధాః**
**కంసః కాలమకాలజం స్వకమలాలీలాపలాయావహమ్ ।**
**సారం కించన పూర్ణపాత్రమపరే గోపైస్సమర్ప్యం విభో-**
**శ్శౌరిం రంగగతం తదా బుబుధిరే రామం చ కామోపమమ్ ॥ (చం.భాగ.189-190)**

స్త్రీలు మన్మథునిగా; సంసారులు దయాసముద్రునిగా; మల్లులు ప్రళయకాలరుద్రునిగా; తల్లి-దండ్రులు క్షీరకంఠుఁడగు పసిబాలునిగా; గోపకులు మిత్రునిగా; పండితులు పరమతత్త్వముగా; కంసుఁడకాలమృత్యునిగా; సామాన్యజనులు నందాదులచే నీయఁబడిన బహుమానమునుగా రంగావతారము చేసిన శ్రీకృష్ణుని భావించిరి. బలరాముని జూచి కూడ నిట్లే తలంచిరి.

ఈ శ్లోకము ఉల్లేఖాలంకారమునకుఁ జక్కని యుదాహరణము. చంపూభాగవతశ్లోకములలో నవరసములు ధ్వనించుచున్నవి.

**శ్రీశ్రీహర్షుఁడు** :

శ్లో॥ **అన్యదస్మి భవతీం న యాచితా । వారమేకమధరం ధయామి తే ।**
**ఇత్యసిస్వదదుపాంశుకాకువాక్ । సోపమర్దహఠవృత్తిరేవ తమ్ ॥ (నైషధ - 18-59)**

ఇది నలదమయంతుల కామకేళీ వర్ణనము.

ఓ ప్రియా! నిన్నింతకు మించి దేనినిమ్మని యడుగను. ఒక్క మాఱు నీ క్రింది పెదవిని చప్పరించెదను. అని మెల్లమెల్లగాఁ గాకూక్తులతో దైన్యముగాఁ బ్రార్థించుచు నలుఁడు హఠాత్తుగా దమయంతిని గాఢముగాఁ గౌఁగిలించుకొని యధరపానము గావించెను.

శ్లో॥ **స్పృశామి తే సుందరి! వారమేకం । పయోధరౌ నాస్మి తు యాచితాఽన్యత్ ।**
**ఏవం నటిత్వా వినయం స మాయీ । ప్రసహ్య జగ్రాహ కుచౌ మృగాక్ష్యాః ॥** (చం.భాగ.3-97)

ఇది గోపీకృష్ణుల రతిక్రీడా వర్ణనము.

ఓ సుందరీ! నీ స్తనముల నొక్కమాఱు నిమురుదును. ఎక్కువ గట్టిగా నొక్కి మర్దింపను. మఱియింక దేనిని యాచింపను. అని వినయము నటించి మాటలలోఁబెట్టి మాయావియైన శ్రీకృష్ణుఁడు బలాత్కారముగా నొక గుబ్బలాఁడి గబ్బి చన్నుల నొడిసి పట్టుకొనెను.

**అనంతభట్టు :** అనంతభ ట్టభినవకాళిదాసునకుఁ బ్రతిస్పర్ధి. ఇద్దఱు పోటీపడి భారత - భాగవత చంపువులు రచించినారఁట!

**శ్లో॥ కల్యాణం వో విధత్తాం కరటమదధునీలోల కల్లోల మాలా**
**ఖేలల్లోలంబకోలాహలముఖరిత దిక్చక్రవాలాంతరాళమ్ ।**
**ప్రత్నం వేదండరత్నం సతతపరిచలత్కర్ణతాళప్రరోహ-**
**ద్వాతాంకూరాజిహీర్వాదరవివృతఫణాశృంగభూషాభుజంగమ్ ॥ (చం.భార.1-1)**

ఇది చంపూభారతములోని వినాయక ప్రార్థనము.

**శ్లో॥ కల్యాణం నః ప్రభూతం కలయతు లలితాలాపశైలేశబాలా-**
**లీలాజాలానుకూలా శిశిరకరకలాభానుమాలాజటాలా ।**
**భద్రా శేషాహిభూషా పరికలితసుధాపూరధారానుకారా**
**ఏషా ముద్రా వినిద్రా పురహరణవిధౌ కాఽపి కారుణ్యపూర్ణా॥ (చం.భాగ.1-1)**

ఇది చంపూభాగవతములో శివస్తోత్రము.

చంపూభాగవతము లోని కొన్ని గద్యములు బాణుని కాదంబరీ శైలిలో శ్లిష్టోపమలతో సాగినవి.

రెండు మూఁడు తావులలోఁ దెలుఁగు కవుల ప్రభావము కూడఁ గలదు.

(1) **పోతన :**

**తే॥గీ॥ మగువలమె? మేము మన్మథమన్మథునకు (భాగ.10-1-1463)**

**శ్లో॥ అయి మన్మథ మన్మథస్త్వయా। (చం.భాగ.3-117)**

శ్రీకృష్ణుఁడు మన్మథమన్మథుఁడని పోతన వలెనే యీ కవియుఁ జెప్పినాఁడు.

(2) **శ్రీనాథుఁడు (15శ.) :**

**సీ॥ గగన కల్లోలినీ కల్లోల మాలికా - హల్లీసకములతో నవఘళించి. (శృం.నై.1-37)**

**గద్యము : గగనకల్లోలినీ కల్లోలమాలికా కలకల విడంబశౌండ నిర్ఝర జయడిండిమాడంబరేషు । (చం.భాగ.1-83)**

**(3) ప్రాస నియమము :** తెలుఁగు కవుల వలె నొక శ్లోకములోఁ బ్రాసనియమము పాటించినాఁడు.

**శ్లో॥ పూతనా తదను నందమందిరం । పాతనాయ సకలార్భసంతతేః ।**
**యాతనాసు నిపుణా సమాయయౌ । చేతనార్దనపరాయణాశయా ॥(చం.భాగ.1-137)**

## కొన్ని చిన్న దోషములు

ఈ కావ్యములో రెండు మూఁడు చిన్న దోషములు దొరలినవి. ఇవి యంత పట్టించుకొనఁదగినవి కావు గాని పరిహరింపఁదగినవే.

(1) **శ్లో॥ భద్రా శేషాహిభూషా పరికలితసుధాపూరధారానుకారా**
**ఏషా ముద్రా వినిద్రా పురహరణవిధౌ కాఽపి కారుణ్యపూర్ణా॥** **1**

ఈ మొదటి పద్యమునందే 'ధారానుకారా + ఏషాముద్రా' యనుచోట సంధి చేయలేదు. సంస్కృత శ్లోకములలోఁ బూర్వార్ధమునకు నుత్తరార్ధమునకు ననఁగా రెండు, మూఁడు పాదములకు సంధి చేయుట దోషము.

'యతిః సర్వత్ర పాదాంతే శ్లోకార్ధే తు విశేషతః' 1,2 పాదములకు; 3,4 పాదములకు సంధి చేయక పోవుట దోషము.

**శ్లో॥ సంహితైక పదే నిత్యా నిత్యా ధాతూపసర్గయోః ।**
**నిత్యా సమాసే వాక్యే తు సా వివక్షామపేక్షతే ॥**

ఇక్కడ వాక్య మనఁగా గద్యవాక్యమే కాని పద్యవాక్యము గాదు. శ్లోకవాక్యములో విసంధి నాలంకారికు లంగీకరింపరు. కాఁబట్టి 'హ్యేషాముద్రా వినిద్రా' యని యుండవలయును.

(2) **శ్లో॥ జ్వాలామాలావలయితమిదం చక్రమాక్రమ్య సౌభం**
**క్షోభం నీత్వా సరయమనయద్బంధురం సింధురంగమ్ ।**
**సత్యా స త్యాజితోఽస్త్రా రిపురపి వపుషా శీర్యతా శౌర్యతాపై-**
**ర్భూరే శౌరౌ గణేయా గుణగణశరణే వారణా వైరిణాం ను ॥ (6-19)**

ఇందలి పూర్వార్ధము మందాక్రాంత (మ-భ-న-త-త-గగ).

'మందాక్రాంతా జలధిషడగైర్మ్భౌనతే తాద్గురూ చేత్' - అని లక్షణము.

ఉత్తరార్ధము స్రగ్ధర (మ-ర-భ-న-య-య-య)

'మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిమునియతియుతా స్రగ్ధరా కీర్తితేయమ్' - అని లక్షణము.

రెండు భిన్నవృత్తముల నొకే శ్లోకములోఁ గలుపుట దోషమే.

లేక దీని నింద్రోపేంద్రవజ్రామేళనము వలన నేర్పడిన యుపజాతి వలె గ్రహింపవలెను.

శ్రీశంకర భగవత్పాదాచార్యులు మాండూక్యోపనిషద్భాష్య ప్రారంభములో నిట్టి దానిని వాడినారు.

**శ్లో॥ యో విశ్వాత్మా విధిజవిషయాన్ ప్రాశ్య భోగాన్ స్థవిష్ఠాన్**
**పశ్చా చ్చాన్యాన్ స్వమతి విభవాన్ జ్యోతిషా స్వేన సూక్ష్మాన్ ।**
**సర్వానేతాన్ పునరపి శనైస్స్వాత్మని స్థాపయిత్వా**
**హిత్వా సర్వాన్ విశేషాన్ విగతగుణగణః పాత్వసౌ న స్తురీయః ॥**

శ్రీరామకర్ణామృతములోఁగూడ నిట్టి శ్లోకములు గలవు.

అందు వల్లనే శ్రీబెల్లంకొండ వారు–

'అత్ర స్రగ్ధరా – మందాక్రాంతయోర్వృత్తయోః సంకరః । వృత్తరత్నాకరకారాదిభిరభ్యుగత ఏవాయమ్। – అని చెప్పి –

**శ్లో॥ శౌర్యోష్మాభిఃద్రుతతనురరిర్బాణపాతాద్గతాసు**
**ర్గణ్యౌ శూరే భగవతి హరే వారణా వైరిణాం ను ॥**

అని సవరణ సూచించినారు.

(3) ప్రకాశ మానంద మముష్య తత్త్వమ్ (1-126)

ఇక్కడ – ఆనంద శబ్దము నపుంసకలింగముగాఁ బ్రయోగింపఁబడినది. ఆనందశబ్దము పుంలింగము.

'స్యాదానందథు రానందః' – అని యమరము.

'ఆనందశబ్దస్య క్లీబత్వేఽయమేవ కవిః ప్రమాణమ్' – అని వ్యాఖ్య.

ఇది తప్పనియే బెల్లంకొండ వారి భావము.

'సత్కార్య ఇవోత్తమశ్లోకగర్భే' – 'సత్ప్రబంధమివ విదర్భసుదృక్ ఫణితిరీతిబద్ధా' (5-2) అని కవియే స్వయముగాఁజెప్పి నట్లుగా నీచంపూభాగవతమంతయు నుత్తమశ్లోకగర్భమే. ఆద్యంతము వైదర్భీరీతి సమన్వితమే.

ఈ చంపూభాగవతమును **సత్యవోలు సోమసుందరకవి** సుందరముగాఁదెనిఁగించినాఁడు.

దీనికి సంస్కృతములో రెండు వ్యాఖ్యానములు వెలసినవి.

మొదటిది 'రత్నావళి'. రెండవది మంథరము.

### మోక్షగుండము – అక్కయసూరి

ఇతఁడు '**మహోపాధ్యాయ**' పక్షధర యెల్లనార్యుని శిష్యుఁడు. మేనల్లుఁడు. చంపూభాగవతమునకు 'రత్నావళి' యను వ్యాఖ్యను రచించినాఁడు.

**శ్లో॥ వెల్లాలకులవారాశిజాతశీతాంశునామునా ।**
**కాళిదాసేన నవ్యేన గీతం శ్రోత్రనభఃకృతమ్ ॥**

**శ్లో॥ కాళిదాసస్య నవ్యస్య నిసర్గమధురా గిరః ।**
**టీకా రత్నావళీ భూషా తథాప్యాసామ్ భవత్యసౌ ॥**

ఈ చంపూకర్త నవ్యకాళిదాసని, వెల్లాలకులవారాశి శీతాంశువని యక్కయ సూరి చెప్పినాఁడు.

**శ్లో॥ గురూన్ ప్రజ్ఞాజితగురూన్ నమామ్యక్కయశాస్త్రిణః ।**
**ప్రవిష్టో నిగమాంతాబ్ధిర్యదనుగ్రహనౌకయా ॥**

**శ్లో॥ ఉమామహేశ్వరజ్ఞేన వెల్లాల కులజన్మనా ।**
**క్రియతే నిర్గుణబ్రహ్మ మీమాంసాతత్త్వచంద్రికా ॥**

అక్కయశాస్త్రి తన గురువని వెల్లాల యుమామహేశ్వరశాస్త్రి తన తత్త్వచంద్రికలోఁ జెప్పినాఁడు. కాఁబట్టి వెల్లాల యుమామహేశ్వరశాస్త్రియే ప్రస్తుత చంపూభాగవతకర్త.

మోక్షగుండము – వెల్లాల రాయలసీమలోని కర్నూలు – కడప మండలములలోని గ్రామములు.

**శ్లో॥ గూఢా భాట్టనిబంధఘట్టసరణి స్తంత్రం గురోర్యంత్రితం**
**కోణం కాణభుజీ భజత్యతిభయాత్ పాతివ్రతీం సాహితీమ్ ।**
**వైయాసక్యనురాగిణీ మయి గిరాం గుంభశ్చ కౌంభీనసః**
**వ్యాఖ్యాతుం నవకాళిదాసకవితామ్ భీతిస్తథాప్యస్తి మే ॥**

భాట్ట – ప్రాభాకర మీమాంసలు; కాణాదతర్కము; వ్యాస వేదాంతము; మహాభాష్యాంతవ్యాకరణము వశమగుటయే కాక పతివ్రత వలె సాహితి కూడ వెంటఁబడిన యక్కయ్యసూరికే వ్యాఖ్యానము వ్రాయుటకు భయము కల్గినదన్నచో భాగవత చంపూగాంభీర్యము నేమని వివరింపఁగలము? వాత్సల్యముతో శిష్యుని కావ్యముపై గురువు వ్యాఖ్య రచించుట గొప్ప విషయమే. ఇది సంస్కృతవాఙ్మయచరిత్రలోఁ గ్రొత్త విషయము కాదు. శిష్యుఁడగు హస్తామలకుఁడు చెప్పిన హస్తామలకీయమునకు శ్రీశంకరభగవత్పాదాచార్యులు వ్యాఖ్య రచించినారు కదా! తాను వ్యాఖ్యానించుటకుఁ దగిన శిష్యుని కృతి లభించుట, తన కావ్యమునకు వ్యాఖ్య వ్రాయుటకు గురువే పూనుకొనుట యుభయులకు గర్వకారణమే. శ్రీ బెల్లంకొండ వారి వ్యాఖ్యకు రత్నావళియే మార్గదర్శిని.

### శ్రీ బెల్లంకొండ రామరాయకవి (1875 – 1914)

ఈ విద్వత్కవిశేఖరు లవతారపురుషులు. సకల శాస్త్రపారావారపారీణులు. సరసకావ్యనిర్మాణ చతురులు. ద్వైతాద్వైతవిశిష్టాద్వైత మతత్రయమర్మవేత్తలు. స్వప్నసాక్షాత్కారములో శ్రీహయగ్రీవ స్వామిచేతనే మంత్రోపదేశము నొంది వేదాద్రిలోఁ దపస్సుచేసి భగవత్సాక్షాత్కారమునొంది సకల విద్యలు కరతలామలకము గావించుకొన్న సిద్ధపురుషులు. శతాధిక గ్రంథకర్తలు. అపర శంకరులు.

శ్రీరామరాయకవి స్వస్తిశ్రీ యువనామ సంవత్సర మార్గశీర్షామావాస్య (27–12–1875) నాఁ డవతరించిరి. గుంటూరు మండలము నందలి నరసరావుపేఁట సమీపమున నున్న **'పమిడిపాడు'** గ్రామము నివాసస్థలము. వీరు ఋగ్వేదులు. ఆశ్వలాయన సూత్రులు. భారద్వాజ గోత్రులు. శ్రీమతి హనుమాయమ్మగారు, శ్రీమోహనరావుగారు జననీజనకులు. ఆదిలక్ష్మి భార్య. రత్నమాచార్యులు మతగురువులు. పురిఘళ్ల రామశాస్త్రిగారు వ్యాకరణగురువులు. పురిఘళ్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తర్కశాస్త్ర గురువులు. తక్కిన విద్యల కన్నింటికి శ్రీహయగ్రీవుఁడే పరమగురువు.

### గ్రంథ సంపద

శ్రీ బెల్లంకొండ వారు నిత్యజీవితములో సంపన్ను లైనట్లే వాఙ్మయజీవితములో బహుగ్రంథ నిర్మాణసంపద గలవారు. సుమారు 145 గ్రంథములు రచించిరి.

(1) **అష్టకములు :**

(1) అద్వైత (2) అమరావతీశ్వర (3) అశ్వత్థ (4) అంబా (5) అగ్ని (6) ఆత్మ (7) ఆర్యా (8) ఆశయహితోపదేశ (9) ఆంజనేయ (10) ఈశ్వర రూప సంగ్రహ (11) ఉపనిషత్ (12) కవితా

(13) కుమారస్వామి (14) కోటీశ (15) గణపతి (16) గురు (17) గోదావరీ (18) గంగా (19) చంద్ర (20) జననీ (21) జయ (22) తులసీ (23) త్రిమూర్తి (24) ద్వైతాద్వైతవిశిష్టాద్వైత సాంఖ్యాచలమతసమ్మత (25) పినాకినీ (26) భగవద్గీతా (27) భగవత్సంబోధన (28) భగవద్భజన (29) భాగవత (30) భూమి (31) మనస్సంబోధన (32) మాయా (33) మురహర (34) రమారాధా (35) రామస్మరణ (36) రామ (37) లక్ష్మీ (38) వాయవ్య (39) విజయ (40) విమతఖండన-పూర్వకాద్వైత (41) విష్ణుభక్తి (42) వేదాద్రిసాలగ్రామనృసింహ (43) వేంకటనాథ (44) శివ (45) శివ భుజంగప్రియద (46) శేష (47) శ్రీకృష్ణ (48) శ్రీదత్తాత్రేయ (49) శ్రీవేదాద్రి యోగానందనరసింహ (50) శ్రీవ్యాస (51) శ్రీశంకర (52) శ్రీహయగ్రీవ పదానుపేక్షా (53) సాగర (54) సాలగ్రామ (55) సూర్య (56) సోమసుందర (57) హనుమద్ (58) హయగ్రీవ (59) హయరాజ (60) హిరణ్యగర్భాష్టకములు.

(2) **స్తోత్రములు :**

(1) జనార్దన స్తుతి (2) ప్రదక్షిణ స్తవరాజము (3) రమావల్లభరాయ (4) వీరరాఘవ (5) శివ (6) సరస్వతీ స్తుతులు (7) హయగ్రీవనవరత్నమాల (8) హయగ్రీవపంచవింశతి.

(3) **అష్టోత్తరశతనామస్తోత్రములు :**

(1) మత్స్య (2) కూర్మ (3) వరాహ (4) నరసింహ (5) వామన (6) పరశురామ (7) రామ (8) శ్రీకృష్ణ (9) బుద్ధ (10) కల్కి (11) హయగ్రీవాష్టోత్తర శతనామావళులు. ఇవి యన్నియు నాద్యాక్షర నియమము గలవి. సవ్యాఖ్యానములు.

(4) **సహస్ర నామస్తోత్రములు :**

(1) పరమాత్మ (2) విష్ణు (3) హయగ్రీవ సహస్ర నామములు. ఇవి కూడ నాద్యాక్షర నియమము గలవి. సవ్యాఖ్యానములు.

(5) **గద్యము :** (1) విశ్వరూపగద్యము

(6) **దండకములు :** (1) హనుమద్ (2) హయగ్రీవ దండకములు.

(7) **శతకములు :** (1) రమావల్లభరాయ (2) హయగ్రీవ శతకములు

(8) **కావ్యములు :** (1) కవిభూషణ (2) కృష్ణలీలాతరంగిణీ (3) గరుడసందేశ (4) రమాపరిణయ చంపూ (5) రుక్మిణీపరిణయచంపూ (6) విష్ణు విజయ (7) సమస్యారత్నాకర (8) సముద్ర మథన (9) సుమనోమనోరంజనములు.

(9) **భాణము :** (1) కందర్పదర్పవిలాసము.

(10) **వ్యాఖ్యాన గ్రంథములు :** (1) కృష్ణోద్ధవ సంవాద (2) భాగవత చతుః శ్లోకీ (3) చంపూ భాగవత (4) మురారి నాట

(11) **వ్యాకరణము :** (1

(12) **ధర్మ శాస్త్రము :** (1 [illegible]

(13) **వేదాంత గ్రంథములు :** (1) అద్వైత విజయము (2) అద్వైతామృతము (3) అద్వైతాన్యమత ఖండనము (4) దేహ – దేహి భావ నిర్మూలనము (5) మోక్షప్రాసాదము (లోకాయతాది యోగాంతమత ఖండనము) (6) వేదాంత కౌస్తుభము (7) వేదాంతతత్త్వామృతము (8) వేదాంత దీపిక (9) వేదాంత నిశ్చయము (10) వేదాంత ముక్తావళి (11) వేదాంత దినకరము (ముక్తావళీ వ్యాఖ్య) (12) వేదాంత సంగ్రహము (13) శంకరాశంకరాభాష్య విమర్శము (14) శారీరక చతుస్సూత్రీ విచారము (15) శ్రీ భగవద్గీతా భాష్యార్క ప్రకాశము (16) సిద్ధాంత సింధువు (శ్రీ మధుసూదన సరస్వతి సిద్ధాంతబిందు వ్యాఖ్య)

(14) **వివిధ విషయ గ్రంథములు :** (1) కామ మీమాంస (2) త్రిపురాసుర సంహారాంతరార్థ ప్రతిపాదనము (3) త్రిమత సమ్మతము (4) ధన వర్ణనము (5) ధర్మ ప్రశంస (6) నియోగి – వైదిక హితోపదేశము (7) బ్రాహ్మణ శబ్ద విచారము (8) భారతాంతరార్థవర్ణనము (9) ముక్తాహారలత (10) రామాయణాంతరార్థశ్లోక త్రయము (11) విద్యార్థవిద్యోతనము (12) వైజయంతి.

బెల్లంకొండ వారి గ్రంథములలో సుమారు 30 మాత్రమే ప్రకటింపఁబడినవి. కొన్ని యముద్రితములు. కొన్ని యలభ్యములు. కొన్ని నామమాత్రావశిష్టములు. (1) చిదానందాష్టకము (2) వేదాంతదీపిక – వ్రాఁత ప్రతులు నా యొద్దఁగలవు. వీలును బట్టి పాఠకుల కందింతును.

ప్రస్తుత గ్రంథము వీరి చంపూభాగవత వ్యాఖ్యానము – మంథరము. ఇది సుమారు 500 పుటల గ్రంథము. శుభకృత్ కార్తిక కృష్ణ దశమినాఁడారంభింపఁబడినది. మాఘశుద్ధాష్టమి నాఁడు ముగింపఁ బడినది. ఈ శుభకృత్తు 1902 సంవత్సరము. సుమారు 63 దినములలో నింత గ్రంథమును రచించిన వీరి బుద్ధి కౌశల్యము, రచనా నైపుణ్యము నూహాతీతములు.

**మంథరము మంథరమే**

మంథర పర్వతము పాలసముద్రమును మథించి యమృతమును దీసినట్లుగా నీ మంథర వ్యాఖ్యానము చంపూభాగవతాబ్ధిని జిలికి సాహిత్యపీయూషమును వెలికిఁదీసినది.

ఈ వ్యాఖ్యాన మంతయు మల్లినాథుని శిశుపాలవధ – సర్వంకషా పద్ధతిలో సాగినది. ముందుగా దండాన్వయక్రమములోఁ బ్రతి పదమునకు నర్థము చెప్పినారు. విశేష పదములకు నర్థము నిర్ణయించుటలో నిఘంటువు లుదాహరించినారు. ప్రయోగవిశేషములకు వ్యాకరణసూత్రములు ప్రదర్శించినారు. శ్లోకమునందలి విశేషము లనన్నింటిని బరిశీలించినారు. అలంకారములు, ధ్వనులు విస్తరముగా వివేచించినారు.

ఛందో నిరూపణములో మాత్రమొక్క మొదటి శ్లోకములో స్రగ్ధర యని చెప్పి లక్షణము నుదాహరించి రెండవ శ్లోకము మొదలుకొని వృత్తనామములను లక్షణములను జెప్పలేదు. ఇది కొంత లోపమే.

(1) **నిఘంటువులు :**

దీనిలోఁ బ్రచారములో నున్న యమర – విశ్వ – వైజయంతీ – రత్నమాలాది నిఘంటువులే కాక యజయ – ధనంజయ – పంచాశన్నిఘంటుసార – ప్రతాప – భాస్కరాది నిఘంటువు లుదాహరింపఁ బడినవి.

